మ॥ రా॥ రా॥ శ్రీ గారికి

Reg. No. M. 2730. సం॥రం. చందా 3—8—0

# స్వతంత్రరైతు

ప్రతి శుక్రవారము ప్రకటింపబడును.

సంపాదకుడు:—దేశిరెడ్డి శేషురెడ్డి.

సంపుటం ౧ ౧౯౩౧ నవంబరు తే ౬ ది శుక్రవారము. సంచిక ౬

## స్వదేశ సంస్థానములు.—గాంధీ మహాత్ముని అభిప్రాయము.

సంస్థానాధీశ్వరులు, తమ ప్రజల హక్కులను న్యాయముగ పరిష్కరించుటకు వారికి స్వేచ్ఛ లేకున్నది. సంస్థానాధీశ్వరులు, వారి రాజ్యములలో ప్రాసాదములందు బందీలు బ్రిటీషుప్రభుత్వము వారిచే చేయబడిరి. కాశ్మీరపరిస్థితులు నేడు ఇటుల ఏర్పడుటకు ఇది యేకారణము—సంస్థానాధీశ్వరులపై అధికారమును బ్రిటిషు ప్రభుత్వము చలాయించు నంతవరకు సంస్థానాధీశ్వరులు తమరాజ్యములందు వ్యవహారములను నిర్వహించుటకు నిజమగు స్వాతంత్ర్యము లేదు.

## మునిసిపల్ ఎన్నికలు.

నూతన చట్టము ప్రకారము ఎన్నికలు ఎన్నడో జరుగవలసి యుండెను. గాని పని ఎక్కువయగుటచేత దొరతనము వారికి మరి కొంత కాల వ్యవధి గావలసి వచ్చినది. ఈ మాసములో ప్రారంభము గనుక ముందు మునిసిపాలిటీల వంతు వచ్చినది.

ఈ ఎన్నికల సందర్భమున గమనించ వలసిన ముఖ్యాంశములు పెక్కులు గలవు. ఓటరుల జాబితాలను తయారు చేయు విషయముల జవాబుదారీ ఆయా సంఘాధికారుల కొసగక ప్రత్యేకము ఇందు సంబంధముగా, ఒక ఆఫీసరును నియమించుట యెంతయు శుభసూచకము. అనుభవము మీదగాని యీ ప్రత్యేకాధికారి వలన లాభాలాభములు తెలవు. సాధారణముగా ఒక బాధ్యత గల్గుటకు కొక్కరికి పదవిని ప్రయోగించిన మరొక విధముగ పరిగణించుట మనకు తెలిసిన విషయమే. మునిసిపల్ సంఘపరిపాలనా వ్యవహారములలో బహ్మల సందర్భమున నేకవిధములుగ బాధలొలగించుట కొకమార్గ మన్వేషించబడిన క్రొత్తపద్ధతి పోకేత మేలనిపించు విషయము అనుభవము గలవారికి తెలియనిదే. ఈ ఎలక్షన్ ఆఫీసరు అధికారము విషయము గూర్చి, ఎలక్షన్లు పూర్తిగ పూనికలోనికి వచ్చువరకు ఇదమిద్ధమని తెలుపజాలము గాని. ఇంతవరకు కొన్ని సంవత్సరాల్లో అలజడిగాని నేటివంటు లేనందుకు సంతసించవలెను.

### ఓటర్లు.

ప్రతివార్డునందును ఓటర్ల సంఖ్య పెరిగినది. శిస్తు కట్టగల్గిన ప్రతివ్యక్తికి ఓటు అధికారము నొసగుచుండినచో ఇందుమూలమున దొరతనము వారి నియామక సభ్యులు ఇక ముందుండరు. గనుక కౌన్సిలు పూర్తిగ అభిప్రాయముతో నిండి యుండును. ఇక మీదట పరిపాలనము సందేహమాత్రం లోపమున్నను దొరతనము సహజాలము. చట్టమున నెట్టి యేని యుక్తములో పనులవల్ల నధికారము చక్కగ వనుండునుగాక. ఉన్నంతలో సమ్యూల ప్రవృత్తులను లేకనుభముగ పరిపాలనము జరుపుకొనుట కవకాశము లొసగబడి యున్నవి. పురపాలన విషయమును ప్రజలు అప్పటికప్పటికి తెలుపరచ వలసినధర్మము ప్రజానాయకుల పైగలదు. ప్రజలకు తగు పౌరధర్మములు కరతలామలకములుగ నుండ వలయును. పాలనము నందలి లోపములు అద్దములోన గనబడినట్లు స్పష్టముగ ఓటరులు గమనించ వలయును.

ప్రతి మునిసిపల్ సమావేశము మన్నన పౌరులలోపములను కొద్దికొంది కౌన్సిలరులకు నివేదింప వలయును. ఓటర్లు తమధర్మమును నిర్వహించనిచో, చేర్మెను గారి పని అవసరము లేదు. ఓటర్లు కౌన్సిలర్లను ఒత్తిడిచేయవలెను. కౌన్సిలర్లు చేర్మెనుగారికి తొందరకలుగ చేయవలెను. అప్పుడు అది ప్రజా ప్రభుత్వము కాగలదు. చేర్మెను గారిమీద విశ్వాస రాహిత్య తీర్మానము నెప్పుడెట్లు అవకాశము గలుగ జేయబడినదో, కౌన్సిలర్లమీద సైతము అట్లే ఓటర్లు విశ్వాస రాహిత్యము కనపరచుటకు అవకాశ ముండవలయును. నేటిచట్టమున నది లేకున్నను ఓటర్లు తమధర్మమును సక్రమముగ నిర్వహించిన కౌన్సిలర్లు తమంతట తామే సంస్కారమును బడయగలరు.

ఇక ప్రజలు తమకు ఒసగబడిన హక్కులను సద్వినియోగపరచునట్లు చేయవలసిన ధర్మము నాయకులపైన గలదు. స్వార్థరహితుడైనవాడే ప్రజానాయకుడని నేటికి ప్రజలు గ్రహించియే యున్నారు, స్వార్థపరులై గౌరవ పదవులను పచ్చువారికి జరుపవలసిన మర్యాదలు ఓటర్లకు తెలియక పోలేదు. గాని, ప్రజాభిప్రాయము గట్టిగట్టింప చేయవలసి యున్నది, అప్పుడే, ప్రజలకు ధైర్యము, ఉత్సాహము, సాహసము, ఆత్మ విశ్వాసముగలుగ గలవు!

### ఈ సారి ఎన్నికలు.

మనపురమున జరుగనున్న ఎన్నికల విషయమున నొకమాట. ఆంధ్ర కాంగ్రెసువారి సందేశానుసారముగా మనకాంగ్రెసువారు తమ పక్షమును కౌన్సిలు ప్రవేశమునకు నిలువబెట్టవలసి యుండెను. గాని ఏ కారణముల చేతనో, వారట్టుల చేయరైరి. అందువలన, నేడు ఓమున పద్ధతి మీదగాని, ఎన్నికలు జరుపబడక, ప్రత్యేక వ్యక్తి రూపకమున జరుగుచున్నవి. అన్నిరకముల అభ్యర్థులును పోటీచేయుచున్నారు. వార్డులనిర్మించుట యందును ఇంచుక దీర్ఘాలోచన మూపబడుటచే, ఏవర్ణమువారి కనుకూలముగ నుండునో అట్లే చేయబడినవి. గుప్పగట్టిన వర్ణాభిమానముగల తెగలు సహజముగ కేంద్రీకృతములై యుండుటచేత, ద్వేషానలము అన్యవర్ణములను ప్రాకుటకు అవకాశముగలుగుట లేదు తమ వర్ణముల వారి మీదనే వారివారి వార్డులను పోటీజరుగుట శుభచిహ్న మనవలయును. వైశ్యులపై వైశ్యులును, రెడ్లపై రెడ్లును, పంచములపై పంచములును, మునసల్మానులపై మునసల్మానులును, బ్రాహ్మణులపై బ్రాహ్మణులును, పోటీలు జరుగుచున్నవి. గాని, అరుదుగా ఇతర వర్ణముల తో పోటీలు జరుగుట యీసారి ఎన్నికల విశేషము.

## ఒక్క విశేషము.

పార్టీ పద్ధతుల గాఢవ్యక్తుల రూపమున పోటీలు జరుగుటచే, మహోన్నతదర్శనములకు అవకాశముగను వుండక పోవుట విచారము. ఇంతవరకు అంతర్య ప్రభుత్వము పరిపాలనము జరుగబడలేదను బ్రిటిషుప్రియము ప్రబలియుండు వుండుటవలన, యీయెన్నికలలో అభ్యర్థులు తమ ఆదర్శములను ప్రకటించుటచేత పెరులకు ఎంతేని అనుకూలముగ నుండ గలదు ఓటరులు తమ ఓట్లనొసగుటకు నిర్ధారించుకొనుట కవకాశము నొసగగలరు. ఎన్నికల తర్వాత కాన్సిలు తన వాగ్దానము ననుసంబంధించి, తనధర్మమును నిర్వహించు కొనుచున్నాడాయని విమర్శించుకొనుట కవకాశముండ గలదు.

---

## చలామణి.

కడచిన నాలుగు సంవత్సరములలోను గవర్నమెంటువారు నూట యిరువది కోట్ల రూపాయలను చలామణి లోనుండి లాగివేసిన సంగతి పాఠకులకు తెలిసియే యున్నది. ఇది రూపాయ మారకము 18 పెన్నీలనుండి జారకుండ చేయుటకు జన్నిన ఉపాయమని అర్థచింతకులందరో బాలాకాలము వాదించినను, గవర్నమెంటు వారేదియో సమాధానము చెప్పి, తప్పించుకొనుచుండిరి. ఇప్పుడు దైవవశాత్తు ఇంగ్లాండు వారి పౌండుకు బంగారపు విగ్రహము సంభవించి, పౌండు విలువ తగ్గి పోవుటయు, పౌండుతో కట్టబడిన రూపాయ మారకముకూడ 18 పెన్నీల నుండి 16 కంటెకూడ తగ్గి, పదమూడు పదునాలుగు మధ్య అల్లల్లాడుటయు సంభవించెను. యిందు మూలమున గవర్నమెంటు వారికే ఉక్కిరి బిక్కిరి అయిచేతులో లెక్క అడలేక చలామణిలోనికి తిరిగి ఎక్కువ డబ్బును విడుదల చేయ వలసినగన దేశీయులెంత మొత్తుకొనినను విననివారిప్పుడు, తమ యవసరమును దీర్చుకొనుటకు 5½ కోట్ల రూపాయలను ఈ నెలలో క్రొత్తగ విడుదల చేసిరి. ఈమాసములో గూడ నింకెన్ని కోట్లనో విడుదల చేసెదరని తెలియుచున్నది. వారి ట్రెజరీ బిల్లులకు సొమ్ము చెల్లించ వలసిన వాయిదాలు గూడమీద పడుచుండుటచే నీ పనిని చేయ వలసి వచ్చినది. గవర్నమెంటు వారు అక్టోబరు 24 తేదీకి 3 కోట్ల 20 లక్షలు, 28 కి కోటి 88 లక్షలు, 31కి ఒక కోటి 80 లక్షలు ట్రెజరీ బిల్లులను చెల్లించవలసి వచ్చెను, ఇట్లే నవంబరులో సుమారు 13 కోట్ల రూపాయలవరకు చెల్లించవలసి యున్నది, ఈ అక్కర కొరకు చలామణిని తిరిగి వృద్ధిచేయక తప్పక వచ్చెను. ఏ యుద్దేశముతో చేసినను ఫలితము మాత్రము మంచిగ నుండుటకు సందియము లేదు. ధరలు పెరుగుటకు అవకాశము కలుగ వచ్చును. ఎగుమతులు హెచ్చవచ్చును. కష్టమును వృద్ధి చేయుటచే దిగుమతులు కొంత వరకు తగ్గును. కాని మారకములో నిలుకడ లేక పోవుటచే పరదేశ వ్యాపారములు సరిగా సాగనేరవు. ప్రపంచవ్యాపారమంతయు బాధపడగ బ్రిటిషు పౌండు అను నాణెము ద్వారానే ప్రవహింప వలసియున్నందున సంగతి వర్తకులకు తెలియని విషయము కాదు, ఇప్పుడా పౌండు విలువ తగ్గి నిలుకడలేకుండ మారుచుండుటచేత నీ నాణెముగుండ వర్తక ప్రవాహము నిరభ్యంతరముగ సాగక ఏదేశములోని సరుకులు ఆ దేశములోనే నిలువయుండి పోవలసిన దుస్థితి సంభవించుచున్నది. ఫ్రాన్సు అమెరికాలవారు ప్రపంచములోని బంగారమునంతను ప్రోగు చేసికొనియున్నందున గాని పౌండు స్వర్ణపద్ధతి భ్రష్టమగుటచే వారి సరుకులు కూడ విడుదల గాక నీ దెబ్బ తమకు పట్టయినదని వారిప్పుడిప్పుడు గ్రహించ గలుగుచున్నారు. బ్రిటిషు పౌండు మారకమును నిలకడలోనుంచుటకు ఫ్రెంచిరాయబారి అమెరికాకు పోయి సంప్రదించుచున్నాడు. పౌండును తిరిగి తిరగలో బంగారపు సంధానము తెప్పదు కాని పూర్వమువలె పౌండుకు 4. 86½ డాలర్ల మారకముండదనుట నిస్సంశయము డాలర్లకు వచ్చునట్లేదరు. అట్లే ఫ్రాన్సులో పౌండుకు 125 ఫ్రాంకుల మారకముండెడిది ఏ మారు ఫ్రాంకులలో మారకమగుచుండె. ఏనూరు ఫ్రాంకులకొనగి వచ్చుచున్నది. అప్పుడు రూపాయ మారకము 18 పెన్నీలుపోయి యే 14 పెన్నీలకో స్థిరపడును.

—కృష్ణాపత్రిక

---

మదరాసు శాసనసభలో ఎస్టేట్సు ల్యాండు అక్టు సవరణ బిల్లు ప్రవేశపెట్టబడి యాబిల్లును ఉపసంహరించుకొనుటకు ద్రోహనము వారికిష్టము లేదనియును. అందు లోకాటాంశ ప్రైవేటుబిల్లు ఉపపాదించిన ప్రభుత్వము ఆలోచించెదరనియును తెలుపబడినవి.

---

## రౌండుటేబిలు సభలు.



బ్రిటిషు ఎన్నికల హడావిడిలో ఇంగ్లీషువారునున్నులను ముఖ్యుల చేత రౌండుటేబిలు వ్యవహారములు చురుకుగా జరుగలేదు. అల్ప సంఖ్యాక సమస్య కొరకు కొన్నాళ్ళు కాలహరణము పోయినది. మహాత్ముడు తన సకలశక్తులను వినియోగించి, తుదకు భగ్నమనోరధుడయితినని తెలుపవలసి వచ్చినది. అధ్యక్షులగు మక్డొనాల్డుగారు ఆ సమస్యా పరిష్కారము నాపివేసి, ఫెడరల్ నిర్మాణ సంఘసభ్యులలో కీవ్యవహారముల మరలించిరి. సంస్థాన ప్రతినిధ్యము బ్రిటిషు ఇండియా ప్రతినిధ్యము ఇత్యాదులు చర్చింపబడినవి. తర్వాత ఫెడరల్ కోర్టు దాని నిర్మాణము అధికారము, ఇత్యాదులు చర్చింపబడినవి. తరువాత ప్రధాన రాజకీయ నాయకులలో గాంధిగారు, మాళవ్యా, సప్రూ, మొదలగువారు కూడ సైనిక, ఆర్థిక వ్యవహారములను గూర్చి చర్చించి బ్రిటిషు వారి అభిప్రాయమును క్రోడీకరింపసాగిరి. ఇంతటితో పోక గాంధిగారు తన అనన్య సామాన్య శక్తి సామర్థ్యములను సద్వినియోగము చేయుచునే యున్నారు.

భారతీయ జనసామాన్య హృదయము నాకర్షించిన విధముననే ఆంగ్లేయ సామాన్య జనహృదయమును గాంధిగారు వశపరచుకొనుటకు సర్వఅవకాశములను విడనాడక, ఉపయోగపరచుకొనుచున్నారు. మఠపీఠములయందు, కర్మాగారములలోపల, క్లబ్బుల మధ్యమున, బహిరంగ ప్రదేశములయందు, గ్రామఫోను ప్లేట్ల ద్వారా, వార్తా పత్రికల మూలమున, పత్రికా విలేఖరులకు ప్రత్యేక సందేశముల పద్ధతిని, ఫోటోగ్రాఫుల పద్ధతి, ఇక నెన్ని విధముల భారతీయాభిప్రాయము ప్రచారముగావలయునో. అన్నిభంగులను మహాత్ముడు కాంగ్రెసు సందేశమును బ్రిటిషు సామ్రాజ్యమునకును, ప్రపంచమునకును వెదజల్లుచున్నాడు. లభ్యపడిన అవకాశమును పోనాడుకొనక, ప్రజా హృదయమున తాను పీఠము వేసికొనుచున్నాడు, ఇంతవరకు మహాత్మునిమీదను, కాంగ్రెసు అభిప్రాయముల మీదను గావింపబడిన దుష్ప్రచారమంతయును, అనతికాలమున పటాపంచలు చేయగలిగినాడు,

రౌండుటేబిలు సమావేశమున్న లాభం గలుగగలదను నమ్మకము మహాత్మునకు లేదు. తన్మూలమున బ్రిటీషు దొరతనమువారు భారత ప్రజలయెడ తప్పక పెట్టెదరని ఎవ్వరును తలచుటలేదు గానివారియందు తత్పరత సంగ్రామ సంసిద్ధము కాంగ్రెసువారైన ఏవాదములు ప్రతిపత్తు. ప్రచారము చేయుటకు సాధ్యము గాని రీతిని మహాత్ముడు ప్రపంచ సాక్షాత్కారము లోబరచుకొనుచున్నాడు, కాంగ్రెసు తత్వమును, ఆంగ్ల ప్రభుత్వ వైఖరిని. ఇంకనూ దొరతనమువారి దుర్గుణములను, లోకమునకు ఎండగట్టి నిలవరీతిని విప్పిచూపుచున్నాడు. బ్రిటిషువారు కాంగ్రెసు మహాసభోద్దేశములను తర్పక. రౌండుటేబిలును అంతఃకలహముల సాధనమో, ఎవ్విధముననో విఫలముకాదినను, లోకమునకు కడపటి సందేశముగా యీ అవకాశమును వినియోగించుకొని ప్రచారము గావించుచున్నాడు.

మహాత్ముని దివ్యసందేశము అంతర్జాతీయముగా గలదు. ప్రపంచములోని నాగరిక దేశములు గాంధిగారికి ఆహ్వానములు పంపుచున్నారు. అమెరికావారు పోవుటకు మాత్రము అవకాశము లేనందున కుందుచు యూరోపా ఖండమును దిరిగి వచ్చుటకేర్పాటొనర్చినట్లు వార్తలు తెలుపుచున్నవి. రౌండుటేబిలు సఫలమయినను, విఫలమయినను, మహాత్మునకు మాత్రము అఖండ విజయముగల్గినదనుటనిర్వివాదాంశమని ప్రాజ్ఞులెరుగకపోరు.

## పత్రికా స్వీకరణము.



నవయుగ:—

ఈపత్రిక వారి 10,25, తేదులలో గోదావరిజిల్లా యేలమర్రు గ్రామములో చౌదరీగారి సంపాదకత్వమున ప్రచురింపబడుచున్నది, నవయుగారంభమునందు భారతవర్షమును సేవింప నున్నయీ పత్రికకు అవసరము. కాంగ్రెసు శంఖము పూరించు మాసోదరి చిరాయువై వరిలుగాక. సం॥ చందా రు 2—0—0. మాత్రమే.

ప్రొప్రయిటర్ సుదర్శనదాసుగారి పైన ఆరోపింపబడిన జామీను కేసువిచారణకు తే10ది వాయిదా వేయబడినది. శ్రీదాసుగారు రు 500 లకు జామీనుంకులు కీయూర నెవరు లేనందున సబ్ జెయిలో రిమాండులో నున్నారు.

—

